

హుజూర్ మెహతాజీ మహరాజ్

రాధాస్వామి దయాలుని చరణకమలకు

ఈ గ్రంథ ప్రసూనము

అర్పించబడినది.

బాల్యమునుండి నా జీవితమును తీర్చి దిద్దిన

నా అన్నగారగు

శ్రీ॥ శే॥ నీలంరాజు ఆదిమూర్తిగారికి

శ్రద్ధాంజలి.

గురు పాదరేణువు

నీలంరాజు

# గాంధిగారి సహాయ నిరాకరణ ఉధ్యమం 1921.

## ప్రకాశం జాతీయ కళాశాల ఫోటో 11-9-1922



నిలుచున్నవారు : నీలంరాజు వెంకటశేషయ్య, అద్దంకి కృష్ణయ్య

కూర్చున్నవారు : గుళ్లాపల్లి శ్రీనివాసులు, చిల్లర రంగారావు
నీలంరాజు ఆదిమూర్తి

క్రిందవరస : అద్దంకి రంగారావు, నీలంరాజు వెంకటసుబ్బరావు
నీలంరాజు రామయ్య

వేదాంత శిరోమణి, వేదాంత విశారద విద్వాన్
**డా॥ శ్రీ పుల్లెల శ్రీరామచంద్రుడు.**
**M.A. Ph. D. (skt) M.A. (English) M.A.(Hindi)**
***Reader in Sanskrit***
***Osmania University,***
**Hyderabad-500 007.**

ఈ మధ్య సంస్కృత భాషాధ్యయనం విషయంలోనూ, తత్ప్రచారం విషయంలోనూ విద్యావంతులలో ఉత్సాహం అధికం అవుతున్నట్లు కనబడుచున్నది. ఇది అస్మాదృశులకు చాలా ఆనంద కరమైన విషయము.

సంస్కృత భాషాధ్యయనం రెండురకాల దృక్పథాలతో జరగ వచ్చు. ప్రాచీన సంస్కృత గ్రంథాలను అర్థంచేసుకొనేటంత జ్ఞానం సంపాదించడంకోసం చేసేది మొదటిది. అంతకంటెకూడా ఎక్కువ భాషాజ్ఞానం సంపాదించి సంస్కృతంలో భాషణ గ్రంథరచనా దులుకూడా చేయడంకోసం చేసేది రెండవది. శ్రీ నీలంరాజు వెంకట సుబ్బారావుగారు, మొదటి దృక్పథంలో సంస్కృత భాషాధ్యయనం చేసేవారిని దృష్టిలో ఉంచుకొని వ్రాసినది ఈ సంస్కృత మార్గదర్శి ప్రథమ భాగము. ఈమార్గదర్శి సహాయంతో ప్రారంభదశలో ఉన్న సంస్కృత విద్యార్థులు సంస్కృత పద స్వరూపాన్ని అనాయాసంగా గుర్తించి రామాయణాద్యుత్తమ గ్రంథాల రసాన్ని ఆస్వాదించ గలుగుతారు. శ్రీ సుబ్బారావుగారు రెండవరకం సంస్కృత పఠితలను దృష్టిలో ఉంచుకొని అనతికాలంలో 'మార్గదర్శి' రెండవభాగంకూడ వ్రాయగలరని విశ్వసించుచున్నాను.

D/ 23-8-79 (Sd) పుల్లెల శ్రీరామచంద్రుడు.

"కళాప్రపూర్ణ"

డా॥ దివాకర్ల వేంకటావధాని M.A. (Hons)

శ్రీ నీలంరాజు వేంకట సుబ్బారావుగారు రచించిన సంస్కృత మార్గదర్శి నందందుచూచి నా అభిప్రాయములను వెల్లడించియుంటిని, భారతీయ సంస్కృతి యంతయు సంస్కృత సారస్వతమునందు ప్రతి బింబించు చుండుననుట సర్వవిదితము. అందుచే ఆ సంస్కృతి స్వరూపము నెరుంగ దలచువారు ఆ సా స్వతమును పఠింపుటకు ఉవ్విళులూరు చుందురు. అట్టివారికి సంస్కృత భాషాతీర్థమున ప్రవేశించుట కిది ప్రథమఘట్టముగా తోడ్పడు ననుటలో సందేహములేదు. భిన్నవృత్తి తత్పరులయ్యు గ్రంథకర్తగారీ విషయమున ప్రదర్శించిన ఆదరాభినివేశములకు వారి నెంతయు ప్రశంసించు చున్నాను.

హైదరాబాదు (Sd) దివాకర్ల వేంకటావధాని

25-8-79

**Dr. I. V. Chalapathi Rao.**
*Registrar*
Central Institute of English & Foreign Languages
HYDERABAD

I have read with delight Sri Neelamraju Subba Rao's book *'Sanskrit Marga Darsi'* which is atonce a guide book to learn Sanskrit and a gateway to rich cultural heritage of life associated with Sanskrit literature. At a time when there is dearth of books simplifying the techniques of Sanskrit learning, and people are frightened to go near that language because of the impression created by pedantic scholars who depict the language as Divine implying comprehension of meaning is neither necessary nor within the scope of ordinary human beings, the value of Sri Subba Rao's book can hardly be minimised.

Being a lawyer by profession and philosopher by propensity he has presented a facile and effortless way to the learning of Sanskrit in a manner that combines analytical thinking with lucid style. Time alone can show how many admirers of Sanskrit classic and seekers of light will derive maximum benifit by learning a great language. Even the Sutras of Maharshi Panini are presented with masterly ease.

I recomend the book sincerely and express the hope that the author's second project also will materialise very soon.

Hyderabad,
2 4-8-79.

(Sd) I. V. Chalapathi Ra

**Dr. P: G. LALYE** (VICE PRINCIPAL)
Head, Dept. of Sanskrit
Osmania University,
HYDERABAD.

The book 'Sanskrit Margadarsi' written by Sri Neelamraju Venkata Subba Rao is very useful for students of Sanskrit. He has taken pains to avoid the niceties of Sanskrit Grammer, which discourage the ordinaty students from studying Sanskrit. He has dealt with almost all the elementary rules of Sanskrit Grammer and composition and illustrated them with suitable examples. These guidelines I hope will certainly encourage the students to study Sanskrit Grammer further.

The author is an advocate and has utilised his talents of analysis, for the use of Sanskrit students, through this book He deserves compliments for his effort, and encouragement for publishing many more such Books.

23-8-79 (Sd) P. G. LALYE.

## *Parichaya*

Sri Donepudi Raghava Rao B. A. Bed,
Retd. Head Master M. H. School, ONGOLE.

I have known for nearly four decades Sri Neelamraju Subba Rao, B. A., LLB., who was a student of the High School in which I had served. Both of us being residents of Ongole, I have had occasional contacts with him and watched with interest his getting wedded to the best in Hindu Tradition and culture. He had dived into the depths of Sanskrit lore and acquired a firm grasp of the varied aspects of the philosophy and literature enshrined in the Sankrit Language The book is ample evidence of his ardour for the propagation of Sankrit study among the younger generation of Indians.

To confess frankly, I am not competent to judge the book. But after Sri Subba Rao took me through every line of the book explaining the rationale of each step, I feel inclined to agree with him that he has blazed a new trail for those seeking to learn "Sanskrit without tears". His profound aim is to help a learner of any age-group to understand any book in Sanskrit, already written and spoken, and explained once by a competent teacher. Though his approach may not be adequate for writing in Sanskrit, a

repeated and diligent study of a book [a kavya for example] will surely form a sound basis, for further independent study of and correct writing in, that language.

He has bared Sanskrit writting to its barest and given a skeletal, Syntactical frame work to go by for any learner. The barest minimum knowlege of Syntex provided here, I am sure, will help a learner to progress by easy steps adding by degrees, tissue and muscle. The rules of agreement and sequence of tense togeher with the use of terminations which form the cement, as it were, to bind words together into a sentence, and the differrent forms of tenses are exhaustively dealt with.

Quite a prodigious amount of patient analytical study has gone into the preparation of this book. Being highly condensed, the fare provided may, at first look, appear caviare to the general. But a patient and discriminating study, will reveal a new untrodden but easy path, into the realm of Sanskrit Literature. Considering the limited but very important purpose of his writing this book, there is no doubt that he has made a good job of it. The book will be quite useful for revising consolidating what has been taught in Sanskrit classe in Schools and Colleges. I hope Sri Subba Rao will prepare similar books for the study of Darsanas and upanishads.

D. RAGHAVA RAO

# *Foreword*



Generally learning of language is considered to start with acquisition of ability to understand words and to constructs sentences to write and speak and then to proceed towards standard works.

In view of the extensive and complicated nature of grammar in Sanskrit and voluminous literature of high standard and quality, in Sanskrit, I concieved an easy and direct, method, to understand the language already written and spoken and acquire the capacity to grasp the beatiful ideas, contained there-in provided it is explained once by a competent person. All Indians, being acquainted with Sankrit vocobulary in their daily use in derivative forms in their respective languages, will not feel any difficulty regarding Sanskrit words. Their memory may be refreshed. Having enjoyed the beauty and serenity of Sanskrit students may later on acquire the capacity to compose or speak correctly without grammatical mistakes.

I hope that, if the principles stated herein are carefully kept in mind and varified in the various Tables given in the eppendix, much progress can be made in grasping the language by all - age groups who are earnest to enjoy the beautiful, precious, and exalted ideas in Sankrit.

The utility of this method can be appreciated on application on inquisitive learners of S a n s k r i t. This cannot claim to be a grammatical text or a Reader but submitted humbly as a simple method. There may be several blunders which I could not rectify in time. I accept with humility all corrections and suggestions from any reader.

I owe much to the renowned scholars 1, Dr. Bhandarkar 2. M. R. Kale, 3. S. C. Vasu from whose standard works guidance is freely taken by me. I am grateful to late B. Markandeyu Sarma garu, late T. Sivasankara Swami, who placed me in right direction. I am indebted to Dr. Lauley Vice Principal Usmania University College, Dr. P. Ramachandrudu Reader of Samskrit in the Same College and Sri Vallur Venkateswarlu garu now "Vimalananda Swami" Upa Peethsdhipathi of Siddeswarapitham Kuruthalam and the learned D. Venkatavadhani garu for their precious suggestions concerning the book,

I have to thank finally Sri Muruthiram Printers, Ongole, for completing the work with care and patience.

*Neelamraju Venkata Subbarao.*
Author

## విషయ సూచిక



### అనుబంధము



### క్రియాప్రకరణం

వేదాంత శిరోమణి, వేదాంత విశారద  విద్వాన్
డా॥ శ్రీ పుల్లెల శ్రీరామచంద్రుడు.
M.A. Ph. D. (skt) M.A. (English) M.A.(Hindi)
*Reader in Sanskrit*
*Osmania University,*
Hyderabad-500 007.

ఈ మధ్య సంస్కృత భాషాధ్యయనం విషయంలోనూ, తత్ప్రచారం విషయంలోనూ విద్యావంతులలో ఉత్సాహం అధికం అవుతున్నట్లు కనబడుచున్నది. ఇది అస్మాదృశులకు చాలా ఆనంద కరమైన విషయము.

సంస్కృత భాషాధ్యయనం రెండురకాల దృక్పథాలతో జరగ వచ్చు. ప్రాచీన సంస్కృత గ్రంధాలను అర్థంచేసుకొనేటంత జ్ఞానం సంపాదించడంకోసం చేసేది మొదటిది. అంతకంటేకూడా ఎక్కువ భాషాజ్ఞానం సంపాదించి సంస్కృతంలో భాషణ గ్రంథరచనా దులుకూడా చేయడంకోసం చేసేది రెండవది. శ్రీ నీలంరాజు వెంకట సుబ్బారావుగారు, మొదటి దృక్పథంలో సంస్కృత భాషాధ్యయనం చేసేవారిని దృష్టిలో ఉంచుకొని వ్రాసినది ఈ సంస్కృత మార్గదర్శి ప్రథమ భాగము. ఈమార్గదర్శి సహాయంతో ప్రారంభదశలో ఉన్న సంస్కృత విద్యార్థులు సంస్కృత పద స్వరూపాన్ని అనాయాసంగా గుర్తించి రామాయణాద్యుత్తమ గ్రంధాల రసాన్ని ఆస్వాదించ గలుగుతారు. శ్రీ సుబ్బారావుగారు రెండవరకం సంస్కృత పఠితలను దృష్టిలో ఉంచుకొని అనతికాలంలో 'మార్గదర్శి' రెండవభాగంకూడ వ్రాయగలరని విశ్వసించుచున్నాను.

D/ 23-8-79 (Sd) పుల్లెల శ్రీరామచంద్రుడు.

"కళాప్రపూర్ణ"

డా॥ దివాకర్ల వేంకటావధాని M.A. (Hons)

శ్రీ నీలంరాజు వేంకట సుబ్బారావుగారు రచించిన సంస్కృత మార్గదర్శి నందందుచూచి నా అభిప్రాయములను వెల్లడించియుంటిని, భారతీయ సంస్కృతి యంతయు సంస్కృత సారస్వతమునందు ప్రతిబింబించు చుండుననుట సర్వవిదితము. అందుచే ఆ సంస్కృతి స్వరూపము నెఱుంగ దలచువారు ఆ సా స్వతమును పఠింపుటకు ఉవ్విళులూరు చుందురు. అట్టివారికి సంస్కృత భాషాతీర్థమున ప్రవేశించుట కిది ప్రథమఘట్టముగా తోడ్పడు ననుటలో సందేహములేదు. భిన్నవృత్తి తత్పరులయ్యు గ్రంథకర్త గారి విషయమున ప్రదర్శించిన ఆదరాభినివేశములకు వారి నెంతయు ప్రశంసించు చున్నాను.

హైదరాబాదు (Sd) దివాకర్ల వేంకటావధాని

25-8-79

బాబాస్వామి సహాయ

# సంస్కృత మార్గ దర్శి

వార్తికకారం వరరుచిం
భాష్యకారం పతంజలిం
పాణినిం సూత్రకారం చ
ప్రణతోస్మి మునిత్రయం॥

భారతీయ విజ్ఞానం ప్రాచీన కాలమునుండి సంస్కృత భాషలో పదిల పరచబడింది. మహర్షులు కఠిన వ్యాకరణ నియమాలచే కట్టు దిట్టంచేసియున్నందున భాష దేశ కాలాలబట్టి మార్పుచెందక విస్తరించు చున్నది. అందుచేతనే సులువు తెలిస్తే పూర్వ సంస్కృత గ్రంథాల మూలములను అర్థము చేసుకొని ఆనందించటానికి ఎక్కువ శ్రమపడ నక్కరలేదు, అవి అన్నియు మృదు మధురమైన తేలిక భాషలోనే రచింపబడినవి. మూలమును విడిచి తర్జుమాలతో తృప్తిపడవనిలేదు. వివిధ వ్యాఖ్యానాలతో చీకాకుపడ నవసరములేదు. స్వయముగా రచనచేయుట మొదట కష్టమనిపించినను అనుభవము మీాద తేలిక పడును.

2 తెలుగు, హిందీ, మళయాళము, మొదలైన భారతీయ భాషలన్నీ సాధారణ వ్యవహారములలో గూడ సంస్కృత పదాలనే విరివిగా ఉపయోగించుకొనుచు పుష్టి అందము చేకూర్చుకొన్నవి. అందుచే భారతీయులకు పూర్వ పరిచయమువల్ల వాక్యములోని సంస్కృత పదాలను గుర్తించడం అర్థం చేసికొనడం సులభం. పాశ్చాత్య భాషల నేర్చుకొనుటకు చేయవలసినంత కృషి పనిలేదు.

3 ప్రాతి పదికలు, ధాతువులు అవ్యయములు అనే మూల పద సముదాయములనుండి సంస్కృత భాష విస్తరించింది. వాక్య నిర్మాణానికి ముందు, ప్రాతిపదికకు విభక్తి ప్రత్యయము, ధాతువునకు క్రియా ప్రత్యయము చేరి పదములు ఏర్పడును. అవ్యయ పదములకు ఏలాటి రూపముల మార్పు ఉండదు విభక్తి ప్రత్యయాలు క్రియా ప్రత్యయాలు వాక్యములోని పదము లన్నింటికినిగల అన్యోన్య సంబంధము తెలుపును. వీటిని గుర్తించిన యెడల వాక్యార్థము స్పష్టమగును.

4 నామవాచకాలు, సర్వనామాలు విశేషణాలు అనే భాషా భాగాలకు చెందిన పదాలు వాక్యంలో ఎక్కువగా ఉంటవి. ఇవి అన్నియు ప్రాతిపదికలకు ఏడు విభక్తి ప్రత్యయములు చేర్చుటచే ఏర్పడినవే. అవి తెలుగులో వలెనే ఆయా విభక్తి అర్థమును తెలుపును.

వాక్యములో క్రియా పదము ఏర్పడటానికి ధాతువుకు ఏదో ఒక క్రియా ప్రత్యయము చేర్చవలెను. ఈ క్రియా ప్రత్యయం ఉత్తమ పురుష, మధ్యమ పురుష, ప్రథమ పురుష అను మూడు పురుషలలో (1st person 2nd person or 3rd personలో) దేనినైననుసూచించును, నేను (మేము) నీవు (మీరు) వాడు (అది, ఆమె, వారు) అను వారిలో క్రియకు కర్త ఎవరయినది తెలుపును.

అవ్యయపదాలు కూడ వాక్య సమన్వయానికి తోడ్పడును.

5 విభక్తి ప్రత్యయాలు :- విభక్తులు ఏడు మాత్రమే. సంబోధనప్రథమ అనేది ప్రథమా విభక్తిలో చేరినదే. అది పిలుపును తెలియజేయును. సాధారణముగా రూపాలలో రెండింటికి భేదములేదు. ఏకవచనములో కొన్నిచోట్ల మాత్రమే కొద్ది రూపభేదముండును.

ఏక వచనాన్ని సూచించుటకు ఏడు విభక్తులలో ప్రత్యేకమైన అక్షరాలు ప్రాతిపదికకు చేర్చుతవి. అలాగే బహువచనము సూచించే ప్రత్యయాలు వేరు. అంతేకాక ద్వివచనము అనేది సంస్కృత భాషలో ఉన్న ప్రత్యేకత. అనగా రెండు వస్తువుల సూచించే ఏకపదాలు ఈ సప్త విభక్తులలోను గలవు. వీటి సూచకాక్షరములను గూడ గుర్తించాలి.

ఉదాహరణకు 'మరుత్' అనే మూలపదము తీసికొని ఏకవచనములోను, ద్వివచనములోను, బహువచనములోను, సప్త విభక్తుల రూపాలు దిగవ పట్టికలో చూపబడినవి. వాటి అర్థము విభక్తి వచనము ననుసరించి వ్రాయబడినది. ప్రత్యేకముగా గమనిలచుటకై విభక్తి సూచక అక్షరముల (ప్రత్యయములు) విడదీసి వ్రాయబడినవి.

---

## పట్టిక

• రాంశము,

(సు) (సు) అం అ ఏ అః, అః ఇ. ఏకవచనముకు సూచించును ఔ, ఔ, ఔ, భ్యాం భ్యాం భ్యాం ఓః ఓః ద్వివచము సూచించును

అః అః అః భిః భ్యః భ్యః నాం సు అను నవి బహువచనమును సూచించును

---

# పట్టిక

## తకారాంత పుంలింగము మరుత్ — గాలి, వాయుదేవుడు

| విభక్తులు | ప్రథమ | సం ప్రథమ | ద్వితీయ | తృతీయ | చతుర్థి | పంచమి | షష్ఠి | సప్తమి |
|---|---|---|---|---|---|---|---|---|
| ఏక | మరుత్ | మరుత్ | మరుతం | మరుతా | మరుతే | మరుతః | మరుతః | మరుతి |
| వచనము | (సు) | (సు) | అం | ఆ | ఏ | అః | అః | ఇ |
| | గాలి | ఓ గాలి | గాలిని | గాలిచేత | గాలికొరకు | గాలినుండి | గాలియొక్క | గాలియందు |
| ద్వి | మరుతౌ | మరుతౌ | మరుతౌ | మరుద్భ్యామ్ | మరుద్భ్యామ్ | మరుద్భ్యామ్ | మరుతోః | మరురుతోః |
| వచనము | ఔ | ఔ | ఔ | భ్యామ్ | భ్యామ్ | భ్యామ్ | ఓః | ఓః |
| రెండు | గాలులు | గాలులారా | గాలులను | గాలులచేత | గాలులకొరకు | గాలులనుండి | గాలులయొక్క | గాలులందు |
| బహు | మరుతః | మరుతః | మరుతః | మరుద్భిః | మరుద్భ్యః | మరుద్భ్యః | మరుతాం | మరుత్సు |
| వచనము | అః | అః | అః | భిః | భ్యః | భ్యః | ఆమ్ | సు |
| | గాలులు | గాలులారా | గాలులను | గాలులచేత | గాలులకొరకు | గాలులనుండి | గాలులయొక్క | గాలులందు |

## 6 నా మ వా చ కా లు

వీటి మూలపదాలు మనుష్యుల పేర్లు, వస్తువుల పేర్లు మొదలైనవి ఏవి అయినను గావచ్చును.

ఈ ప్రాతిపదికల సహజరూపము చివర హల్లు ఉంటె హలంతము లంటారు. సాధారణంగా చ, జ, త ద న భ ర వ శ ష స హ అనే హల్లులు ఉంటవి.

ప్రాతిపదిక అచ్చుతో అంతమై ఉంటె అజంతములు. అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ మొదలైనవి అచ్చులు.

ప్రాతి పదికలు 1. పుం లింగము, 2. స్త్రీ లింగము 3. నపుంసక లింగము అని మూడు విధములు. మొదటివి పురుషుల పేర్లు మొదలైనవి తెలుపును. స్త్రీల పేర్లు మొదలైనవి స్త్రీలింగము లగును. మిగతవి నపుంసక లింగములు.

ప్రాతిపదిక నిజరూపము బట్టి, నిఘంటువు ప్రకారము, లింగభేదము తెలిసికొనవలసియుండును.

ఉదాహరణ- గ్రంథః- పులింగము; పుస్తకం- నపుంసకలింగము

ఈ దిగువ పట్టికలో హలంతములు, అజంతములు, క్రమముగా పులింగము స్త్రీ లింగము నపుంసక లింగములలో ఉదాహరణలు ఈయబడినవి.

—

హలంతశబ్దములు -

| | పుంలింగము | స్త్రీలింగము | నపుంసకలింగము |
|---|---|---|---|
| చ | జలముచ్ - మేఘము | త్వచ్ - చర్మము | సువాచ్ - బాగపల్కునది |
| జ | భిషజ్ - వైద్యుడు | స్రజ్ - దండ | అసృజ్ - నెత్తురు |
| త | మరుత్ - వాయువు | హరిత్ - పచ్చని | యకృత్ - మాంసము |
| ద | దివిషద్ - దేవత | మర్మవిద్ - రహస్యము తెలిసిన | హృద్ - మనస్సు |
| ధ | బుధ్ - జ్ఞాని | క్షుధ్ - ఆకలి | విస్రబ్ధ - నిశ్చలమైనది |
| న | ఆత్మన్ - ఆత్మ | సీమన్ - దేశము | గుణిన్ - గుణముకలది |
| శ | విశ్ - వైశ్యుడు | దిశ్ - దిక్కు | తాదృశ్ - అట్టిది |
| ష | ద్విష్ - ద్వేషించువాడు | త్విష్ - ప్రకాశించునది | సితత్విష్ - తెల్లగా ప్రకాశించునది |
| స | వేధస్ - బ్రహ్మ | సుమనస్ - మంచి మనసుకలది | మనస్ - మనస్సు |
| హ | లిహ్ - రుచిచూచువాడు | ఉపానహ్ - పాదుక | లిహ్ - ఆస్వాదించునది |

అజంతశబ్దములు

| | | | |
|---|---|---|---|
| ఇ | హరిః - విష్ణువు | మతి - బుద్ధి | వారి - నీరు |
| ఈ | సుధీః - తెలిసినవాడు | గౌరీ - పార్వతి | ప్రధి - |
| ఉ | శంభుః - శివుడు | ధేను - గోవు | మధు - తేనె |
| ఋ | ధాతృ - బ్రహ్మ | మాతృ - తల్లి | కర్తృ - చేయునది |
| అ | రామః - రాముడు | రమా - లక్ష్మి | ఫలమ్ - ఫలము |

అనుబంధములో పైన కనుబర్చిన ప్రాతి పదికల కన్నిటికిని ఏడు విభక్తులలో ఏక వచనములో ఏర్పడిన రూపాలు తరువాత ద్వివచనము బహువచనములలో ఏర్పడిన రూపాలు వివరంగా చూపబడినవి. అవి అన్నియు వ్యాకరణ సూత్రముల ప్రకారం దోషరహితముగా ఏర్పడినవి ఈ రూపాల నన్నిటిని పరిచయమునకై కొన్నిసార్లు చదివి పరిశీలించ వచ్చును. కంఠస్థము చేయ పనిలేదు. ఆ యా పదముల విభక్తి సూచకాక్షరముల గుర్తు పట్టగల సామర్థ్యము కలిగితేచాలు. సంస్కృత వాక్యములోని ఏపదముకుగాని విభక్తిని గుర్తించి అర్థమును మనసున నిలుపుకొనవచ్చును.

7 నామవాచక రూపాలు ఏర్పడుటలో గమనించవలసిన విషయములు

1 హలంత ప్రాతి పదికలు మూడు లింగములలో ఒకేరీతిగా విభక్తి ప్రత్యయాలను చేర్చుకొని పదాలుగా ఏర్పడినవి. హల్లుల బట్టి భేదమేగాని వేరే భేదములేదు.

2 నపుంసక లింగములో ప్రథమా విభక్తి మూడు వచనములలో కొద్ది రూపభేదముగలదు. ఏక, ద్వి, బహువచనములలో క్రమంగా అమ్. ఇ. ఈ అను ప్రత్యయాలు చేరును. సంబోధనప్రథమ లోను ద్వితీయా విభక్తిలోను అవే రూపములు ఉండును.

3 అజంత శబ్దములలో విభక్తి ప్రత్యయాలు చేరినపుడు సంధి సూత్రాలను బట్టి ప్రాతిపదికలకు కొద్ది మార్పులు కలుగును. విభక్తి వచనము గుర్తించుటకు అవి అడురావు.

4 అకారాంతములైన పుంలింగ నపుంసకలింగ ప్రాతిపదికలకు కొన్ని చోట్ల విశేష రూపాలు ఏర్పడినవి.

తృతీయ బహువచనము రామైః ఫలైః (భిః రాలేదు)

పంచమి ఏకవచనము - రామాత్ ఫలాత్ (అః రాలేదు)
షష్టి ఏకవచనము- రామస్య- ఫలస్య

5 పుంలింగ ప్రాతి పదికలకు ఆ ఈ ఊ ఈ అను అక్షరములు చివరన చేర్చుటచే సాధారణంగా స్త్రీలింగ ప్రాతి పదికలు (bases)అగును

ఉ:- బాలః- బాలా, కుమారః - కుమారీ; వర్తకః - నర్తకీ; కమండలుః - కమండలూః మొదలైనవి

తకారాంతములకు

ఉ:- ఈ చేరును జాగ్రత్ -జాగ్రతీ- పచత్ పచంతీ మొదలైనవి

6 కొన్ని ప్రాతి పదికలకు అ, ఆమహ, ఇయ మొదలగు తద్ధిత ప్రత్యయములు చేరుటచే నూతన ప్రాతి పదిక లేర్పడును. ఉః వాసు ఉదా:- వాసుదేవః; పితామహః; క్షత్రియః మొదలైనవి

7 విభక్తి ప్రత్యయాలు చేరిన తరువాత ఒకే రూపమున ఉన్న పదాలకు సందర్భమునుబట్టి విభక్తి వచనము గమనించి అర్థము చెప్ప వలెను.

| విభక్తులు | | |
|---|---|---|
| పంచమీ, షష్టి | మరుతః 2 | ఏక వచనము |
| ప్రథ; సం ప్ర; ద్వి | మరుతౌ 3 | ద్వి ,, |
| తృ, చ, పం:- | మరుద్భ్యామ్ 3 | |
| షష్టి, స :- | మరుతోః 2 | |
| ప్ర; సం ప్ర; ద్వి | మరుతః 3 | బహు ,, |

8 సర్వనామములు వాక్యములో నామవాచకాలకు బదులుగా వాడుతారు. పదములకు లింగ వచన విభక్తిని బట్టి రూపాలుమారుతవి

తత్ అనే ప్రాతిపదిక సః, సా, తత్ అను రూపాలను పుంలింగ స్త్రీ లింగ, నపుంసక లింగములలో ధరించును. వాడు, ఆమె, అది

అని అర్థము ఇచ్చును. ఉదాహరణగా, ఏడు విభక్తులలోను ఏర్పడిన రూపాలు చూపబడినవి. లింగభేదముచే కలిగిన వ్యత్యాసములను గమనించాలి.

పుంలింగము - వాడు

| | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 |
|---|---|---|---|---|---|---|---|
| ఏ | సః | తం | తేన | తస్మై | తస్మాత్ | తస్య | తస్మిన్ |
| ద్వి | తౌ | తౌ | తాభ్యామ్ | తాభ్యామ్ | తాభ్యామ్ | తయోః | తయోః |
| బ | తే | తాన్ | తైః | తేభ్యః | తేభ్యః | తేషామ్ | తేషు |

స్త్రీ లింగము - ఆమె

| | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 |
|---|---|---|---|---|---|---|---|
| ఏ | సా | తాం | తయా | తస్యై | తస్యాః | తస్యాః | తస్యాం |
| ద్వి | తే | తే | తాభ్యామ్ | తాభ్యాం | తాభ్యాం | తయోః | తయోః |
| బ | తాః | తాః | తాభిః | తాభ్యః | తాభ్యః | తాసాం, | తాసు |

నపుంసక లింగము - అది.

| | 1 | 2 | 3 |
|---|---|---|---|
| ఏ | తత్ | తత్ | తేన |
| ద్వి | తే | తే | తాభ్యాం |
| బ | తాని | తాని | తైః |

శేషమవి పుంలింగము వలెనె ఉంటవి. నపుంసక పదములకు ప్రథమ ద్వితీయంలో ప్రత్యేక ప్రత్యయములు చేసును.

అహం - నేను (అస్మత్); త్వం - నీవు (యుష్మత్) అను సర్వనామాలకు ఏర్పడిన రూపములు దిగువన చూపించ బడినవి. వీటికి లింగ భేదము లేదు. హ్రస్వరూపాలను గూడ గమనించవలెను

అస్మత్ - నేను

| | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 |
|---|---|---|---|---|---|---|---|
| ఏ | అహం | మాం మా | మయా | మహ్యం మే | మత్ | మమ మే | మయి |
| ద్వి | ఆవాం | ఆవాం నౌ | ఆవాభ్యామ్ | ఆవాభ్యామ్- నౌ | ఆవాభ్యామ్ | అవయోః - నౌ | అవయోః |
| బ | వయం | అస్మాన్ నః | అస్మాభిః | అస్మభ్యమ్ నః | అస్మత్ | అస్మాకం నః | అస్మాసు |

యుష్మత్ - నీవు

| | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 |
|---|---|---|---|---|---|---|---|
| ఏ | త్వం | త్వామ్ - త్వా | త్వయా | తుభ్యమ్ - తే | త్వత్ | తవ - తే | త్వయి |
| ద్వి | యువామ్ | యువామ్ -వామ్ | యువాభ్యామ్ | యువాభ్యామ్ -వామ్ | యువాభ్యాం | యువయోః వామ్ | యువయోః |
| బ | యూయమ్ | యుష్మాన్ వః | యుష్మాభిః | యుష్మభ్యమ్ వః | యుష్మత్ | యుష్మాకమ్-వః | యుష్మాసు |

హ్రస్వరూపాలు- ద్వితీయ, చతుర్థి, షష్ఠి విభక్తులందుమాత్రమే గలవు. వీటిని వాక్యము మొదట వాడరు. సంబోధన వాచకము తరువాత వాడరు. సముచ్చయములైన చ, వా, హా, ఏవ తరువాతను ఉపయోగించరు.

అనుబంధములో విభక్తిని వచనమును గుర్తించుటకు వివిధ సర్వనామ ప్రాతిపదికలు పొందిన రూపాలు వివరింపబడినవి. సంఖ్యా వాచకాలు, వరుసను తెలుపు సర్వనామ పదములుకూడ చూపబడినవి.

## 9 విశేషణములు -

విశేష్యములను అనగా నామవాచక సర్వనామ పదములలో దేనినిగాని ఇవి వర్ణిస్తవి. వీటి ప్రాతిపదికలకు లింగభేదము లేదు. కాని వర్ణింపబడె విశేష్యము యొక్క లింగ, వచన, విభక్తుల ననుసరించి విశేషణ రూపాలు ఏర్పడును వాక్యములో ఒకవిశేష్యమును అనేక విశేషణములు వర్ణించ వచ్చును. సంస్కృత భాషలో ప్రతి విశేషణము విభక్తి ప్రత్యయమును ధరించవలెను. ఇందుచే వాక్యనిర్మాణము మొదట కష్ట మనిపించినను నిర్మింపబడిన వాక్యములు సులభముగా స్పష్టముగా అర్థము చేసికొనవచ్చును. విశేషణముల క్రమ ప్రకారం ఒకచోట చేర్చి అర్థము చెప్పవచ్చును.

ఉదాహరణ- అహం, శ్వేతం, సుందరం అశ్వం పశ్యామి
నేను తెల్లని సుందరమైన గుర్రమును చూచుచున్నాను

ధాతుజన్య విశేషణములు మొదలైనవి తరువాత వివరించబడును.

10 క్రియలు-ఇవి ధాతువులు (Root) అనే మూల పదాలకు ప్రత్యయము చేరుటచే ఏర్పడును. వాక్యములో అహం- నేను అనేది కర్తయైనచో ఉత్తమ పురుష సూచించు ప్రత్యయము చేరును. కర్త-త్వం-నీవు అయినచో మధ్యమపురుష ప్రత్యయము ధాతువుకు చేరును కర్త సః-వాడు అయినచో ప్రథమ పురుష ప్రత్యయము వచ్చును పురుషలు మూడు మాత్రమే గలవు.

ఏకవచనములోను, ద్వివచములోను, బహువచనములోను వేరు వేరు ప్రత్యయములు చేరతవి.

ఉదాహరణ - నమః= నమస్కరించుట దీని క్రియాపదములు అర్థము గమనించవలెను.

| ఏకవచనం | ద్వివచనము | బహువచనము |
|---|---|---|
| అహం నమామి | ఆవాం నమావః | వయం నమామః |
| నేను నమస్కరింతును | మేమిద్దరమునమస్కరించుదుము | మీరందరు నమస్కరింతుము |
| త్వం నమసి | యువాం నమథః | యూయం నమథ |
| నీవునమస్కరించుదువు | మీరిద్దరునమస్కరిందురు | మీరందరునమస్కరించుదురు |
| సః నమతి | తౌ నమతః | తే నమంతి |
| వాడునమస్కరించును | వారిద్దరు నమస్కరింతురు | వారందరు నమస్కరింతురు |

ప్రత్యయములు పట్టిక

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ఉత్తమ పురుష | మి | వః | మః |
| మధ్యమ పురుష | సి | థః | థ |
| ప్రథమ పురుష | తి | తః | అంతి |

11 సాధారణంగాపరస్మైపద ఆత్మనేపదఅని ధాతువులురెండు విధములు పైన చెప్పబడిన తొమ్మిది ప్రత్యయములు పరస్మైపద ధాతువులకు చేర్చబడేవి. తిఙ ప్రత్యయములు అంటారు. ఆత్మనే పద ధాతువులకుచేరు ప్రత్యయములు చాలవరకు వీటిని పోలియుండును. వాటిని తఙ ప్రత్యయాలు అందురు. పోలిక గమనించుటకు రెండును ప్రక్క ప్రక్కను చూపబడినవి.

| పర. ప్రత్యయములు | | | ఆ ప్రత్యయములు | | |
|---|---|---|---|---|---|
| మి | వః | మః | ఇ | వహే | మహే |
| సి | థః | థ | సే | ఆథే | ధ్వే |
| తి | తః | అంతి | తే | ఇతే | అంతే |

ఉదాహరణ -

వద్ = చెప్పుట పరస్మైపద; వంద్ = నమస్కరించుట ఆత్మనేపద

| | ఏ | ద్వి | బ | ఏ | ద్వి | బ |
|---|---|---|---|---|---|---|
| ఉ | వదామి | వదావః | వదామః | వందే | వందావహే | వందామహే |
| మ | వదసి | వదథః | వదథ | వందసే | వందేథే | వందధ్వే |
| ప్ర | వదతి | వదతః | వదంతి | వందతే | వందేతే | వందంతే |

కొన్ని ధాతువులు- ఉభయపదులు పరస్మైపదధాతువులకుకూడ కొన్ని సమయములలో ఆత్మనేపద ప్రత్యయములు చేరును. కొన్ని ధాతువులకు అర్థములో తేడా చాలాస్వల్పము.

ఉదాహరణ :- నమామి (పరస్మై) - నమస్కరింతును.

నమే (ఆత్మనేపద) - నమస్కరించుకొందును.

## 12 వికరణములు –

ధాతువులన్నియు పది గణములు లేక వికరణములుగా విభజింపబడినవి. సాధారణముగా వికరణ భేదము బట్టి అర్థము మారదు. పరస్మైపద ధాతువులకు ప. ప్రత్యయాలు, ఆత్మనేపద ధాతువులకు ఆ. ప్రత్యయాలు చేరుతవి.

అవసరమైనపుడు వివిధ వికరణముల తేడాను గుర్తించుటకు దిగువ పట్టిక ఈయబడినది. పురుషను తెలుపు ప్రత్యయము చేరుటకు ముందు ధాతువు చివరన కొన్ని అక్షరములు చేరును. కొన్ని లకారములలోనే ఈ మార్పులు గలుగును అవి తరువాత వివరింపబడును.

| వికరణములు, | మార్పు | ధాతువు; | అర్థము | ప | ఆ |
|---|---|---|---|---|---|
| 1 భ్వాదులు- | అ | నయ్ : | తీసికొనిపోవు | నయతి- | నయతే |
| 2 అదాదులు- | - | దుహ్ : | పాలుపిండు | దోగ్ధి- | దుగ్ధే |
| 3 జుహోత్యాదులు- | - | ధా : | ఉంచు | దధాతి- | ధత్తే |
| 4 దివాదులు- | య | దివ్ : | ప్రకాశించు | దీవ్యతి- | దీవ్యతే |
| 5 స్వాదులు- | ను | సు : | రసముతీయు | సునోతి- | సునుతే |
| 6 తుదాదులు- | అ | క్షిప్ : | త్రోయుట | క్షిపతి - | క్షిపతే |
| 7 రుధాదులు- | న | క్షుద్ : | పిండిచేయు | క్షుణత్తి- | క్షుంతే |
| 8 తనాదులు- | ఉ | తన్ : | విస్తరించు | తనోతి - | తనుతే |
| 9 క్ర్యాదులు- | నా | క్రీ : | కొనుగోలుచేయు | క్రీణాతి- | క్రీణీతే |
| 10 చురాదులు- | అయ | చుర్ : | దొంగిలించు | చోరయతి- | చోరయతే |

గమనిక- 1, 4, 6, 10 వికరణాల ధాతువులు అకారాంతములు.- ప్రత్యయాలు చేరునపుడు మూలపదాలకు [Roots] మార్పురాదు.
2 వికరణములో ధాతువులోనికి ప్రత్యయము చేరిపోవును.
ఉ: అద్మి, స్తః, మొదలైనవి
3 వికరణములో ధాతువు మొదటి హల్లు మార్పుచెంది ద్విరుక్తము Reduplication అగును. ఉ- దధాతి. మొదలగునవి.

5, 7, 8, 9 వికరణ ధాతువుల రూపము కొద్దిగా మారి క్రమముగా ను, న, ఉ, నా అను అక్షరములు కలిసినతరువాత ప్రత్యయాలు చేరును.

ప్రధానమైన విషయము- క్రియాపదముల పురుషను వచనము గుర్తించుటన్నే.

అనుబంధములో పది వికరణ ధాతువులకు పరస్మైపదలో ఏర్పడిన తొమ్మిది రూపాలు, ఆత్మనేపదలో ఏర్పడిన తొమ్మిది రూపాలు వివరించబడినవి.

తరువాత తరుచుగా వచ్చే ధాతువులపట్టీ ఇవ్వబడినది. వాటి అర్థము, వికరణ సంఖ్య ఏ పద అయినది, మార్పడినరూపములు ఇవ్వబడినవి.

13 క్రియాపదముయొక్క కాలములు అర్థకములు మొత్తము పది గలవు. వాటిని (Tenses and Moods) లకారములు అంటారు

A ప్రస్తుతకాలము — ఒకటి

i లట్ - Present :- ప్రస్తుతము జరుగుతున్న విషయమును క్రియ తెలుపును

ఉ : వదతి చెప్పుచున్నాడు   గచ్ఛతి : పోవును

## B భూతకాలములు మూడు

### 1 లఙ్, అనద్యతన భూతము- Imperfect

ఇంతకుముందు ప్రొద్దికాలము క్రిందట జరిగిన విషయము, ఇంకను పూర్తిగాని విషయముల తెలుపును.

ఉ: అగచ్ఛత్ - పోవుచుండెను, పోయెను.

### ii లుఙ్ - సామాన్య భూతకాలము- Aorist

జరిగిన విషయము ఫలాని కాలము అని చెప్పకుండా ఉన్నపుడు ఎల్లపుడు జరుగుచున్న, జరిగిన విషయముల క్రియ తెలుపును.

ఉ: సః అధ్యైష్ట వేదాన్, త్రిదశాన్ అయష్ట.

అతడు వేదములు చదివెను, దేవతల యజించెను.

[illegible] మ్న పాదాత్ = [illegible] కాలము అన్నదానను [illegible]ను.

### iii లిట్ - పరోక్ష భూతము- Perfect

ఎప్పుడో జరిగినది కర్త చూడని విషయము తెలుపును.

ఉ: తాం తాటకాఖ్యాం నిజఘాన రామః.

ఆ తాటకి అనుదాని రాముడు చంపెను.

రామో నామ బభూవ- రాముడను పేరుగలవాడు ఉండెను

## C భవిష్యత్ కాలములు- రెండు

i లుట్ - Peri phrastic Future -కొంతకాలము అయిన తరువాత జరుగబోవు విషయము తెలుపును.

ఉ: భవితాస్మి - అయ్యెదను.

ii లృట్ భవిష్యత్ Future

కొద్దికాలములో జరుగబోవు విషయమును తెలుపును

ఉ: గమిష్యతి=పోగలడు. వదిష్యంతి=ఇంక మీాదట చెప్పగలరు మొదలైనవి.

D అర్థకములు_ Moods నాలుగు

1 లృఙ్-సంకేత లేక చేదర్థకము-Conditional·
జరిగినట్లయితే లేక జరిగేయెడల అనేపరిస్థితిని సూచించును. వాక్యము పూర్వభాగము వలెనే ఫలితాంశమైన ఉత్తరభాగమునందును క్రియా రూపము వాడవలెను.

ఉద- సువృష్టిః అభవిష్యత్ చేత్ తథా సుభిక్షం భవిష్యత్. మంచివర్షము కలిగేయెడల అపుడు ధాన్యవృద్ధి అగును.

2. లోట్ —ఆజ్ఞ-Imperative mood.

ఆదేశము, ప్రార్థన, ఆశీర్వచనము, మర్యాదపూర్వకమైన ప్రశ్న సలహా, సామర్థ్యము మొదలైనవి క్రియ సూచించును.

ఉ:- శుశ్రూషస్వ గురూన్;=పెద్దలకు సేవచేయుము;

3. విధి లిఙ్; Potential Mood

క్రిందివారికి ఆదేశము· ఆజ్ఞ యిచ్చునపుడు వాడుదురు. నిమంత్రణము-పుట్టి ఆహ్వానము; అధీష్ట - బాధ్యత నిర్వర్తింపుమని చెప్పుట: సంప్రశ్న- మర్యాదగా ప్రశించుట, ప్రార్థన - ప్రాధేయ పడుట, సూచించును. సందర్భమునుబట్టి Imperitve గాని Potential గాని- లోట్, లేక, లిఙ్ - ఏది యైనను వాడుదురు.

ఉ. త్వం కన్యాం. వహేః. నీవు కన్యను భరించవలెను.

4. ఆశీః లింజ్ ; Benedictive Mood.

ఆశీర్వచనము, కోరికను, తెలుపును.

ఉ; చిరంజీవేత భవాన్ - తమరు చిరకాలము జీవించుదురు గాక.

అనుబంధములో పది లకారములకు పరస్మైపద, ఆత్మనే పదలో ఏర్పడిన రూపముల పట్టి ఇవ్వబడినది.

14. వర్తమానకాల [లట్ కు] చేరిన ప్రత్యయములు లోగడ చెప్పబడియున్నవి. కడమ లకారములలో గూడ చిన్నమార్పులతో అవే ప్రత్యయములు ధాతువునకు చేరను. కాబట్టి క్రియయొక్క పురుష, వచనము గుర్తించుట కష్టముగాదు.

ఆ మార్పులేమిటో పరిశీలించుటకై అనుబంధములో ప్రత్యయముల విడదీసి పట్టి ఈయబడినది. ఆరు లకారములకు అక్కడక్కడ మారిన అక్షరముల గుర్తించవచ్చును. కడమ నాలుగు లకారములు ధాతువుకు ప్రత్యయమునకు మధ్య కొన్ని అక్షరములు చేరుటచే ఏర్పడినవి.

నాలుగు లకారములలో మాత్రమే మూలములైన ధాతువులు కొద్ది మార్పులు చెంది ప్రత్యయముల చేర్చుకొనును, దీనినే వికరణ మందురు. వీటిని సార్వధాతుకము లందురు. అవి 1. వర్తమాన Present లట్ 2. అనద్యతన. భూత లఙ్ Imperfect - 3. లోట్ Imperative 4. లిఙ్ Potential. కడమ లకారములలో ధాతువునకే ప్రత్యయములు కలుపబడును, వీటిని ఆర్ధధాతుకము లందురు.

కొన్ని ధాతువులకు మొదటి హల్లు, అచ్చుతోసహా, ద్విరుక్త మగును. (Reduplicate అగును) అనుబంధములో వీటి వివరము తెలుపబడినది.

కాలము, అర్థకముల ఉపయోగించిన వివరములున్న అను బంధములో చెప్పబడినవి.

15. సకర్మ క్రియలు అకర్మక క్రియలు అని రెండువిధములు. ద్వికర్మకములని కొన్ని క్రియలకు రెండు కర్మలు ఉంపవచ్చును.

1 కర్తరి ప్రయోగము, 2 కర్మణి ప్రయోగము, 3 భావేప్రయోగము. Voices : Active, passive and Imperso nal.

ఉ; 1. రామః సత్యం భాషతే రాముడు సత్యమును చెప్పెను
2. సత్యం రామేణ భాష్యతే సత్యము రామునిచేత చెప్పబడుచున్నది.
3, రామేణ గమ్యతే. రాముడు పోవును

సకర్మక క్రియలు కర్తరి - కర్మణి ప్రయోగములందు వాడబడును.

అన్ని ధాతువులు కర్మణి ప్రయోగములో ఆత్మనే పదప్రత్యయముల ధరించును

16. ఏర్పడిన క్రియలు Derivative v erbs. ఇవి నాలుగు విధములు - నూతన ప్రత్యయాంతధాతువు [basis] ఏర్పడిన తరువాత సాధారణ ప్రత్యయముల గ్రహించును.

1. ణిజంతములు - Casuals ప్రేరణార్థకములు- పనిని చేయించుటను తెలుపును. ధాతువునకు 'య' కారము చేర్చుటచే రూపొందును.

గమ్- గమయతి, బోధ్- బోధయతే తెలుపబడుచున్నది,

2. సన్నంతములు - Desideratives - పనిచేయు కోరికను తెలుపును.

పఠ్- పిపఠిష్యతి - చదువకోరుచున్నాడు.

3. యజంతములు- Frequentitives మరల మరల నిరంతరము, జరుగు పనిని తెలుపును.
దహ్-దదహ్యతే, మండుచూ వున్నది.
జ్ఞా- జి జ్ఞాయతే తెలుచుకొనుచూ యున్నాడు
4. నామ క్రియలు– Nominal verbs నామవాచకమునకు 'య' చేర్చుటచే క్రియ ఏర్పడును.
పుత్ర + య — పుత్రీయతి - పుత్రుని గోరుచున్నాడు.

ధాతువుల నుండియే నామవాచకములు, విశేషణములు, అవ్యయములు ఏర్పడి భాషను విస్తరింప చేసినవి.వీటిని కృదంతములందురు.

ఆ పదము లన్నియు ధాతువుయొక్క అర్థమునకు సమీప సంబంధము కలిగి యుండుటచే ఆపదముల అర్థము చేసికొని గుర్తుంచుకొనుట సులభము.

17 ధాతుజన్య నామవాచకములు
ఉదా: కృ- కారః, కర్తృ, కార్యః మొదలగునవి

అనుబంధములో సామాన్యముగ వచ్చు ధాతువులు వాటి అర్థము ఈయబడినవి.

18. ధాతు జన్య విశేషణములు Participles

1 Present Active participles
వర్తమాన క్రియను సూచించుటకు ధాతువు చివరన 'అత్' చేరును. ఉ- గచ్ఛత్ ధావత్ ఖాదత్ మొదలైనవి.
పోవుచున్న, పరుగెత్తుచున్న, తినుచున్న
కృ= చేయు - చకృవత్ = చేయునట్టి
√ దృశ్ =చూచుట దదృశ్వస్= చూచునట్టి
దా = ఇచ్చు- దదత్ = ఇచ్చునట్టి.

2 **Present passive- Participle** వర్తమాన కర్మణి

ఉ: దద్యత్ = ఇవ్వబడు. పచ్యత్ = వండబడు.

3. **Past Active participle.**

భూ= ఉండు. భూత= ఉన్న భూతవత్ = ఉండినట్టి
కృ= చేయు కృత = చేసిన కృతవత్ = చేసినట్టి
ఛిద్ - కోయు ఛిన్న-కోసిన, ఛిన్నవత్ - కోయబడిఉన్నట్టి

4. **Past passive participle.**

స్నా= స్నానముచేయు స్నాత = స్నానము చేయించిన
శ్రి= ఆశ్రయించు శ్రిత = ఆశ్రయింపబడిన
శ్రు= విను శ్రుత= వినబడిన శంక్ = సంధేహించు
శంకిత శంకించబడిన

3 **Participles of future Active & Passive**

దా - ఇచ్చు దాస్యత్ - దాస్యమాన, దాయిష్యమాణ
భూ- ఉండు భవిష్యత్ - భవిష్యమాణ.
చుర్ - దొంగిలించు చోరఇష్యత్ - చోరమాణ,
చోరిష్యమాణ

4. **Potential particls Active & passive.**

దా - ఇచ్చు. దాతవ్య, దానీయ.
శ్రు - విను శ్రోతవ్య, శ్రవణీయ
కథ - చెప్పు, కథనీయ
భృ - భరించు. భార్య

19. ధాతుజన్య అవ్యయములు.

i ధాతువుకు క్త్వా చేర్చిన అసమాపక క్రియయగును.
భుక్త్వా. జ్ఞాత్వా, కృత్వా. భుజించి తెలిసికొని చేసి

ii య చేర్చుటచేకూడ ఏర్పడును.

ఉ- ఆ+దా+య=ఆదాయ పరి+త్యజ్+య-పరిత్యజ్య.

iii ధాతువునకు అన్ చేర్చుటచే అవ్యయ మగును.

ఉ- దా-దాయమ్ = ఇచ్చుట ఛేద్-ఛేద నె
గమమ్; చక్రబంధం; ఊర్ధ్వశేషం.

iV తుమున్నంతములు

ఉ కర్తుం, భవితుం, గంతుం.
చేయుటకు. అగుటకు. పోవుటకు.

### 20. ఉపసర్గలు ;

ధాతువునకు ముందు కొన్ని అక్షరములు [Prefixes] చేరి దాని అర్థములు పలువిధములుగా మార్చును. ఈ ప్రకారము అనేక నూతన ధాతువులు ఏర్పడుచున్నవి.
ఆ. సం, నిర్, ఉప, అధి. మొదలగునవి ఉపసర్గలు.

ఉ- గమ్=పోవుట ఆగమ్=వచ్చుట సంగమ్=కలియుట నిర్గమ్=తిరిగి వచ్చుట ఉపగమ్=దగ్గరచేరుట అధిగమ్=తెలిసికొనుట;- మొ॥
ఉపసర్గల జాబితా అనుబంధములో యివ్వబడినది,

### 21. అవ్యయములు

వాక్యములోని పదములను భాగములను సమన్వయ పరచుటకు ఇవి సహాయపడును,

i ఇవి ప్రతి పదోక్తములు, లాక్షణికములు అని రెండు విధములు.
పూర్వం నుండి సహజముగా ఉన్నవి ప్రతి పదోక్తములు.
ధాతువుల నుండి ఏర్పడినవి లాక్షణికములు.

ii అన్ని అవ్యయములను 5 విధములుగా వర్గీకరింపవచ్చును.

1. సాధారణమైనవి- Adverbs
2. ఉపసర్గలు - Prefixes
3. కలుపునవి - Conjunctions
4. ఆశ్చర్యమును తెలుపునవి - interjections
5. నిర్దేశించునవి Particles

అనుబంధములో కొన్ని అవ్యయముల పట్టీ యివ్వబడినది.

22. వాక్యములోని వివిధ పద నిర్మాణము, పదముల కలయిక, సమాసములు సంధిసూత్రముల ద్వారా ఏర్పడుచున్నవి.

i స్వరసంధి-అచ్చులతో అచ్చులు కలియుట, గుణసంధి, వృద్ధిసంధి సవర్ణదీర్ఘసంధి మొదలైనవి.

ii పదముల చివర నున్న హల్లులతో అచ్చులుగాని హల్లులుగాని కలియుట హల్సంధి తెలుపును.

iii పదము చివర ఉన్న 'స్' ష, ర, కారములు తరువాత వచ్చు అక్షరములబట్టి 'ః' విసర్గగామారుట విసర్గసంధి అగును.సంధులు కొంత వరకు అనుబంధములో చెప్పబడినవి.

23. కొన్ని పదములు చేర్చి ఏక పదముగా వాక్యములలో ఉపయోగించిన సమాసమందురు. అప్పుడు మధ్యపదములకు ఉండవలసిన ప్రత్యయములు లోపించి చివరిపదమునకే విభక్తిప్రత్యములనుచేయును. మధ్యపదములకు కూడా ప్రత్యయములను తిరిగి చేర్చి పూర్ణరూపము చెప్పునప్పుడు 'విగ్రహము' అందురు.

తత్పురుష, కర్మధారయము, ద్విగు, బహువ్రీహి, అవ్యయీభావము. ద్వంద్వము, మొదలగు సమాసములు అనుబంధములో వివరించబడినవి.

24. అలంకారములు. ఇవి వాక్యానికి అందాన్ని గాంభీర్యాన్ని ధ్వనిని కల్పిస్తాయి. ఉపమ, రూపకము, ఉత్ప్రేక్ష, వ్యాజస్తుతి- మొదలగు అలంకారముల సరళి తెలిసికొనుట మంచిది. ఛందస్సు గూడా అర్థము చేసికొనుటకు సహకరించును.

25. వాక్యంలోని పదములన్నియు అన్యోన్య సంబంధము కలిగి ఉంటవి. 1. క్రియ కర్తతోను 2. విశేషణములు, విశేష్యములతోను సంబంధము కలిగివుండును.

i క్రియకు కర్తకు గల సంబంధమునే కారకము అంటారు. ఇది ఏడు విభక్తుల ద్వారా ఏర్పరచ బడినందున మొదటనే విభక్తి గుర్తింపు విధానము చెప్పబడినది. 1 కర్త, 2 కర్మ, 3 కరణ 4 సంప్రదాన, 5 అపాదాన, 6 సంబంధ, 7 అధికరణములు. గమనించవలెను.

సంస్కృత వాక్యములో క్రియను గుర్తించి కః ఎవరు? అని ప్రశ్నించుకుంటే కర్త వచ్చును. కం ఎవని? అంటే కర్మపదము తెలియును. అలాగే కేన-ఎవనిచేత, కస్మై = ఎవని కొరకు, కస్మాత్ =ఎవనినుండి, కస్య=ఎవనియొక్క, కస్మిన్=ఎవనియందు అను ప్రశ్నలద్వారా క్రియతో వివిధ పదములకు గల సంబంధము తెలియబడును. దీనినే ,ఆకాంక్ష' అందురు.

ii విశేష్య విశేషణ సంబంధము లోగడ చెప్పబడినది.

iii సంబంధ సర్వనామములు అవ్యయములు వాక్యభాగముల కలుపును. యత్-తత్; యదా-తదా మొదలైనవి.

Vi సంస్కృత వాక్యాలలో పూర్ణరూపమున క్రియల వాడకం చాల తక్కువ. సాధారణముగా క్రియలు చేసే పని అంతయు విశేషణములు, వానిని చెందని అవ్యయములు, నిర్వహిస్తూ ఉండుటచే భాష నేర్చుకొనుటలో క్రియారూపనిర్ధారణమైన శ్రమ చాల తగ్గును.

26. వాక్యములో కర్త ప్రథమావిభక్తి, కర్మ ద్వితీయవిభక్తిలోను ఉంటవి. క్రియ, అకర్మకము ద్వికర్మకముగా వచ్చును.

ఉ- సః గ్రంథం పఠతి. సః గచ్ఛతి. సః రామం పుస్తకం యాచతి.

ii కర్మణ్యర్థకములో సాధారణముగా కర్త్రర్థకములోని ద్వితీయ విభక్తిలోనున్న కర్మ, ప్రథమావిభక్తి లోనికివచ్చి కర్తగా ఉండును. లోగడ కర్తగా వున్నది తృతీయ విభక్తి లోనికి పోవును. కర్మణ్యర్థమున క్రియ ఎప్పుడు ఆత్మనేపద ప్రత్యయములనే ధరించును.

ఉ- తేన గ్రంథః పఠ్యతే.

iii వాక్యములో పూర్వభాగము ఉత్తరభాగముతో సంబంధము కలిగి వుండును.

ఉ- యస్యాస్తి విత్తం- స నరః, కులీనః - ఎవనికి ధనమున్న అతడే గొప్పమనిషి యత్-తత్- అలాంటి సంబంధముల తెలుపును.

27. i వాక్యములో తర తమ భావముల తెలుపుటకు ప్రాతిపదికలకు ఈయః ఇష్ట-తర, తమ, ప్రత్యయములు చేర్చబడును

ఉ- లఘు - లఘుతర - లఘుతమ
లఘు - లఘీయః లఘిష్ట
పటు - పటీయః - పటిష్ట
మతిమత్ - మతీయః - మతిష్ట

ii క్రియలలోకూడ ఇవిచేరి అవ్యయములగు చుండును
ఉ। పచతి - పచతి తరాం - పచతి తమాం

iii అతిశయముగా చెప్పుటకు రెండు విధములైన ప్రత్యయము లున్ను చేరుట కలదు.

శ్రేష్ఠ - శ్రేష్ఠతర - శ్రేష్ఠతమ
పాపీయ - పాపీయస్తర - పాపీయస్తమ

iv వర, ప్రవరలు గూడ తర తమ భావముల తెల్పును.
ఉ- ముని - ముని వర - ముని ప్రవర -

28. శ్లోకమునుగాని వాక్యమునుగాని అర్థము చేసికొన దలచినపుడు పదవిభజనచేసి, ఖండములను అన్వయక్రమమున పెట్టవలెను: ప్రతి పదార్థము తెలిసికొని అన్నిటిని చేర్చిన దండాన్వయ మగును. సారాంశమును క్లుప్తముగా చెప్పిన తాత్పర్య మందురు. సంస్కృత సూత్ర గ్రంథముల గ్రహించుటకు భాష్యములో చెప్పబడిన వాక్యములను గూడా పరిశీలించ వలెను.

29. కోరిన గ్రంథమును, అనగా, ఉపనిషత్తులు శ్రవ్య దృశ్య కావ్యములు, శాస్త్రములు, పురాణాదులలో వేటిని గాని ఎన్ను కొని గురుముఖతః ఒకసారి భావమును చెప్పించు కొనినచో సాహిత్య మంతయు సులభమై జ్ఞాపకము పెట్టుకొనుటకు వీలగును.

30. సకల విద్యలలో సారము అనుభవ పరుడైన సమకాలిక గురుని వాక్యమే. అట్టి సద్గురునకు నమస్కారము.

తమసో మా జ్యోతిర్గమయ
మృత్యోర్మా అమృతం గమయ!!

ఓం తత్సత్

**R S**

